

శ్రీ లక్ష్మీ నృశింహాయ నమః

## 1 ప్రకరణము.

### నాటరాగం—అటతాళం.

శరణంకర వాణీ, తవచరణౌ। శరణంకరవాణీ॥

ఉపపల్లవి ఉ.—వరదశ్రీవైకుంఠ వాహినీపతే। పరమసూరిగణాభరణ విష్వక్సేన॥శరణం॥

౧. మిత్రౌఘవనచైత్రా। అంబుజపత్ర। నేత్రాదానవజైత్రా। వేత్రాగ్రనియమిత విశ్వకల్మషవల్లీ। దాత్రపవిత్ర సూత్రవతీకళత్రా॥శరణం॥

౨. ఖచరసన్నుతచరణా, పరవాసుదేవ। సచివసంసృతితరణా సచరాచరలోకజాల సంభరణావై। రిచమూహరణ, దివ్యరుచిరాభరణా॥శరణం॥

౩. అతులితగుణజాలా• వేదాంతవేద్య పతితపావనశీలా। వితతపరాశర, వేంకటచెలదాస, సతతసన్నుతపాద, జలజజలదనీల॥శరణంకరవాణీ॥

కేదారగౌళరాగం - ఆదితాళం. ౨

విహంగరాజంకలయే। అహమహన్యహని, హృన్నిలయే॥
అ- మహామహిమ్నమహిత। విహారసమ్మృతభు। గహార్యగిభ వి
గ్రహం, హరివహం॥విహంగ॥

౧. కారుణ్యామృతసింధుం, భవ। కలుషవిదారణబంధుం। పురా
ణపూరుష, ధురీణవాహన, సురారిపృతనానిరాకృతి చ
ణం॥విహంగ॥

౨. శశాంకధవళశిరస్కం। పృథువిశాలభాస్వదురస్కం, నిశా
టసంఘాటశైల, జాలవినిశాతనకులిశ। నిశాతనఖరం॥విహంగ॥
౩. బిలేశయ, శయనకేతుంని। ర్మలినస్వర్మగణసేతుం। లలితగుణాప
ముల్లసత్పరాశర కులజవేంకటా, చల్దాసనుతం॥విహంగరా
జంకలయే॥

ఆరభిరాగం—అటతాళం.

జయజయా, స్వామిన్ జయజయా॥
అ. జయశేషమూర్తే, సముదగ్రకీర్తే। భయహరహంతవ, భ
క్తానువర్తే ॥జయ॥
౧. అమలమాణిక్య సహస్రోత్తమాంగ। కమనీయ్యశశికోటి సశు
భవళాంగ। అమితకృపాసముదంచితపాంగా। ఆనందభోగా
సమగ్రాంతరంగా ॥జయ॥
౨. శ్రీశ్రీనివాసావి శిష్టపర్యంకా, ఆశ్రితవృజినరథాంగశశాం
కా। విశ్రుతగుణసర్వవినుత విశంకా, వికటారిదృషమగ్ర విష
ధూమటంకా ॥జయ॥
౩. శేషత్వ సముదిత శేషోభిధానా, శోషితభవనిత్య సూరిప్ర

ధానా। పోషితామర బుధపుంజనిధానా। పురుషోత్తమదివ్య భోగావిధానా ॥జయ॥

౪. సనకాదిముని బృందసన్నుతచరణా, సంకర్షణాది దివ్యాంకావతరణా। దినమణిమణి ఘృణిదీపితాభరణా, దివ్యాంగరాగా దివ్యవిస్ఫురణా ॥జయ॥

౫. ఉరుకేతన వరికృతోత్తుంగతాలా। తరళైక కర్ణకుండలసుకపోలా। స్థిరపరాశరగోత్ర సుమచిరశీలా। ధరవేంకటాచలదా సానుపాలా ॥జయ జయ॥

## సౌరాష్ట్రరాగం—అటతాళం. ౪

జయవిజయీభవ। శ్రీకృష్ణమురారే। గోవిందమురారే। జయ విజయీభవ॥

అ. జయవిజయీభవ। శంఖచక్రధర। శరధిరాజతనయారమణా। దయమానహృదయాబ్జ। దనుజాంతకహరి। హాయనుతపదపీతాంబర శోభిత ॥జయ॥

౧. గరుడగమన భాసురశేష శయనా, కమల విమల సుందరనయనా। సురభూసురముని వరనికర శుభం। కరగోవర్ధనగిరిధరమురహర ॥జయ॥

౨. పూతనాశకటవి। ఘాతనపాతిత। వాతదనుజవృషబకదమనా। పీతమర్ధనవ। నీతఘృతవివి। ర్ధాతమరితసంఘాతనిజావన॥జయ॥

౩. జయపరాశరా। న్వయసతతముశ్చాభ్యుదయ। వెంకటాచలదాసనుతా। ప్రియతమశ్రీరాజుపేట। పురవరాలయ, రాజగోపాల లలితకపోలా ॥జయ విజయీభవ॥

---

## ద్విపద.

అని, విశిష్టేష్టదేవాభివందనము- మునుకొని, కావించి, మో
దంబుగాంచి। అఖిలజగజ్జనరవనభంగాదినిఖిల। లీలారస ని
త్యరతుండు, వీక్షింప। వినత వివిధభూతజాలి। రక్షణదీక్షాధు
రంధరుండతుల। వేదాంతవిఖ్యాతవిపులప్రభావు। డాదిపర
బ్రహ్మమానందమయుడు। శ్రీనివాసుడు శేషచివ చిచ్ఛరీరి। దీ
నబంధుడుదయా దివ్యాంబురాశి, యైననారాయణునంఘ్రి
సరోజ। గానసుధారసకలితచిత్తుడను। వరమరుమద్దాలివంశా
బ్ధిహరిణ। ధరకృష్ణయార్యాఖ్య ప్రధానసుతుండ। వెంకటాచలదా
స విశ్రుతాఖ్యుడను, పంకంబునెడబాసి, భవవారిరాశి। పా
రంబుజేరగా బరగినతెప్ప। నారాయణుని దివ్యనామకీర్తన
మే। యని నిశ్చయంబుగా నాప్తులవలన। విని యదిగానాను
వృత్తమానేని। తనరినతేనెయు ద్రాక్షయుగూర్చి। కరమొప్ప
పాలు శర్కరయును గూర్చి। పరగనాస్వాదించు భంగియా
గాదె। యదిగానశ్రీ నృశింహస్వామి, దివ్య సదమలచరితం
బు। సంగ్రహంబుగను। కీర్తనంబులుగాగ। కృతియొనరించి।
కీర్తింతుననిగమకించితిగాని। లక్షణ నాటకాలంకారకావ్య।
శిక్షయింతయునిట జెప్పగాలేదు। మరిపదవాక్యప్రమాణవిచా
ర। పరిచితిదూరతోపాస్తమేకాదే। కావుననిదియెట్లుకడతేరు
ననక। దేవదేవుడు వాసుదేవుడుతానే। వాత్సల్యరసపూరవా
రిధిగాన। మత్సమీహితము నెమ్మదినెరవేర్చు। ననికాంచియీ
దురత్యయకృత్యమునకు। పనిబూనితినిగాని। భవ్యాత్ములార।
ఖ్యాతిలాభార్చనకై కాదు। గానప్రీతమనస్కులైప్రేమనావె
డల। చొప్పడగాజూచిసురుచిరభంగి। తప్పులనెన్నక దయచే

యీరయ్యా। ఒప్పమీరకకిరీటమున్నట్టి తలకు। చొప్పపాటింపగను ల్లెంచినట్లు। నారాయణునిదివ్యనామకీర్తనము। సారంబుగన కద్దోసము లెన్నదగునె। మరియును దీని నెమ్మదిబరికించి। యర సిన సుజనప్రియంబె కాయనుచు। గమకించితిని జెప్పు। గానిట్టిది వ్య, రమణీయ తరకథారంభ మెట్లనిన, రాజోత్తముడు పాం డురాజసూనుండు। రాజసూయముభాసురంబుగా జేసి। యు న్నచో। నారదయోగిచంద్రుండు క్రన్ననవచ్చినగాంచి। పూ జించి। ప్రహ్లాదచరితంబు। పరమపావనము। నాహ్లాదకరము నై। యమరును గాన వినగోరెదను జెప్ప వే। మునిచంద్ర, య ని వేడనాతడిట్లని చెప్పదొణగె॥.

శుద్ధసావేరిరాగం—ఆదితాళం. ౫

శ్రీవిభవనిలయా, పరిపాలి। తావనీవలయా॥ శ్రీవరనరసింహా

ఉ:— వతార కథ। భావముజెలగహా। తావధి సేవధిగా వివరించెద

॥శ్రీవిభవనిలయా॥

౧. లోకపావనమూ। మునిదివిజా। నీకజీవనమూ, తేకువ లేకని। రాకులసంపత్తోకముులకురవి। రాకయనదగును, చేకురుభూ రిపివేకముఘోరము హాక ల్మషదర్వీకర భీకర కేసిర వంబులు

॥శ్రీవిభ॥

౨ దీనరక్షణమూ, అతిమురహం, మానశిక్షణమూ। శ్రీనరసింహుడు, మాన కెప్పుడుదన। హానిగజేకొను।గానవిలసద సమానమైె నవిజ్ఞానము। భక్తియు, నొనరవరయను మానము। మానుమ

నూనముగానగు ॥శ్రీవిభ॥

3. స్థిరకురుముద్దాలీ। వేంకటాచల।వరదానునిపాలీ।సురనుతమగు భాసురసురతరువన। సురుచిరవరములు సారదిసొసంగుచు। సురవిరోధియా। హిరణ్యకశిపునుసురుగొని, తత్సుతవరశుభ కరుడనదిరముగబరగెను॥ శ్రీవిభవనిలయా॥

కాంబోది రాగం-ఆది- ౬

పాండవేయా, పండితవిధేయా। పాండవేయా॥

ఉ:—గండుమగంటిమి, నిండినతనయను, జుండగుకొనకా। తుండు వరాహత, నుండగుహారచే భండనమునని। హయుండగుబవిని ప్ర। చండకోపమున, మండితపంబు, ద్దండతజేయప। సిండి యొడలయసురుండడవికిజనే॥పాండ॥

౧. చాలగావడినీ, కాలాంతకోగ్ర। కీలికైవడినీ, నేలపైబొటన వ్రేలూనిమహా। ఖేలగతిగగన। చాలిజూచుచువి। శాలబాహు వులనోలి నూర్ధ్వముక। రాళవ్యాళులబోలజూచియు। త్రాలదే హముపిపీలికలుదినగ। జాలిజెందకవలీలగ నిలచెను॥పాండ॥

౨. ఘోరరూపముగా, లోకములకెల్లా భూరితాపముగా, క్రూర తపమునీ। తీరునసలుపను, రారిమస్తకద్వారమున వెడలె। భో రుననుంటలుపొగలు మిణుగురులు। వారిధులుగలగె, ధామణి బగిలెను బోరగిలబడెను ధారుణిధరములు। తారలురాలెను తల్లడిలెజగము॥పాండ॥

3. నలకుజెందకనూ। దైత్యేంద్రుడెంతయు। బెలుకునొందకనూ, జలజగర్భుపద జలజయుగము మది। నెలకొలిపిసుదృఢనియతి

నుండగను। బలమరిసురలయ్యలజడికోర్వక। నలువకునింతయు దెలుపజనిరియు। తర్లికనుకురు మద్దాలి వేంకటాచలదాస నుతుని పలువరుడలచుచు॥పాండవేయా॥

శంకరాభరణం-అట 2

విన్నవించిరిసురలూ ।బ్రహ్మతోడ।విన్నవించిరిసురలూ॥

ఉ;—సన్నిధానముజేరి సన్నుతించిమ్రొక్కి। క్రన్ననతమకైనగాసి యల్లనపుడు॥విన్నవించిరీ॥

౧. ఉడుకసాగెనుచూడుమీ। స్వర్గముదైత్యు కడిదితపము వేడిమీ। అడుగులత్తృత్పుటమోవనలవిగాక చాల।బడలికనొందినీకడకుజేరి తిమని॥విన్నవించిరీ॥

౨. విపులనిష్టమించీ, నీవలెదీర్ఘతపమునాచరించీ। ఇవుడెనీపదవిదా। నపహరించియెల్లపుడనుదానేయే। లగనెంచినాడని॥ విన్నవించిరీ॥

3. మరియునొకర్జాడా। తోచెనతనిమతమునెంచిచూడా। అరుదైనతపముచేనఖిల నాశముజేసి। తిరుగక్రొత్తసృష్టిబరగించునోయని ॥విన్నవించిరీ॥

౪ దీనులబాలింపవే। దీనికిప్రతీవి, ధానముగావింపవే। దానవనాథుసంమానించి తపమును। మానజేసి జగమున్నింపవేయని ॥విన్నవించిరీ॥

౫. పంకజాతవాసినీ।కురుమద్దాల్ వెంకటాచలదాసునీ। శంకర్బోదట్టినచందాననీవుమా। యంకిలిబాపిశ్శ స్మరిసి కావుమని ॥విన్నవించిరీ॥

సావేరి రాగం—ఆది. తా

వినవేధరణీశా, కీర్తిప్రకాశ। వేష్టితాఖిలాశా॥

ఉ;—వనజభవుడు దేవతలమనవివిని। వెను వెంట సురలు మునులు గొలిచిరా। గనుహిరణ్యకశిపుని యాశ్రమవన। మునకునతనిగ నుగొనజను దెంచెను ॥విన వే॥

౧. పుట్టలుకోమలు, బోయగప్పైపై। చెట్టులెదుగగను చీమలు దోమలు। పట్టిదేహ మెడపడక కరచితన। పట్టుగదలనిపిగాఢధైర్యగనె ॥విన వే॥

౨. కడిదితపముగ్రపు వేడిమిచే। నుడికిలోకములుసుడిబడుచుండగ। అడరిమేఘపటలాంతర రవికై। వడివెలిగెడుసురవైరి గనిపలికె ॥విన వే॥

3. ఓహోహా దైతేయోత్తమ లేలె। వ్యాహారనీతపము త్యాశ్చర్యము। దేహముపురువులు దినగను బ్రాణా।లూంహిపగ నెట్లుండెనో యనుచును ॥విన వే॥

౪. నీరన్నముమా, నీరీతినిపది। నూరుల యేండ్లెవ్వారుండెదరా। రాగనీపసరి, లేరికనిచ్చెద। కోరుము వరములవారిగననుచు ను॥విన వే॥

౫. పలుమారిటుసంభావించిధరా।తలమున కురుహద్దాలి వెంకటా। చలదాపనుతుని, దలచియతనిపై। గలయక మండలజలములు చిలికెను ॥విన వేధరణీశా॥

---

కళ్యాణి రాగం—అట. ౯

భావించివినవే నరేంద్రా। వాసు దేవపాదభక్తిసాంద్రా॥

ఉ:—యీవిధమున దానవేంద్రుడు బ్రహ్మాసం। భావింపగా పుట్టబయ.

లు దేరివచ్చె॥

౧. నైపరంజిఛాయలుదేరా। దేహమద్భుతమై యొప్పుమీరా ఉ

పమానరహితమై, యొప్పుచున్నదీప్తు। లపరిమితంబుగ నంతట

వ్యాపింప। విపులధైర్య స్థైర్యబలసమ। వేతసకలావయవుడయ్యె

ను॥ భావించి॥

౨. మీదనున్న బ్రహ్మజూచీ। ధరణీ మీదట చేతులు జాచీ। మోద

ముప్పొంగగ మ్రొక్కి లేచి నిలచి। ఆదరంబుతోడ నానందబాష్ప

ముల్। మేదురంబుగగురియపులకో, స్నేహసంవృతగాత్రుడయ్యె

ను॥ భావించి॥

౩. విలసిల్లభక్తివహించీ। ప్రేమ కలితుడైన ప్రమతగాంచీ। వెల

య కురుమద్దాలి వెంకటాచలదాస। కులదైవనాభిసలిలజాత

జాతుని। గళముడగ్గుత్తికపడగనుతి। పలుపదలకొనియెనిట్లనుచు

॥భావించి॥

జంఝోటి రాగం—రూపకం. ౧౦

అనిశమునను బ్రోవవయ్యా। హంస వాహనా॥

ఉ—వినుతింప నెంతవాడ, విశ్వమోహనా॥ అనిశ॥

౧. సృష్టిస్థితిలయకర్త పుశిష్టజనశరణ్యా, అష్టవిధ విభూతీశుడవ

మరగణవరేణ్యా॥ అనిశ॥

౨. వీక్షింపవే కర్షుణతోడవితతారుణగాత్రా। రక్షింపవే శరణంటి సరస్వతీకళత్రా॥ అనిశ॥

౩. అలకురుద్దాలి వెంకటాచలదాసునికీ। జలజనయనువలెనీవును। వేలసితినాపనికీ॥ అనిశము॥

సౌరాష్ట్రరాగం—ఆట ౧౧

వినవయ్యా రాజతనూజా। వైరిగణభీషణధ్వాంతదినరాజ తేజా॥

ఊ—వనుజేంద్రమడీరితి వనరుహగర్భుని। వినుతులుజేసిచేకొని యెనువరములు॥ వినవయ్యా॥

౧. మదినాతపమునకు మెచ్చి, నాకు సదయుడవైవరములిచ్చి। ముదమొప్పనాదరింప దలచితివయేని। యిదెకోరెదను సత్యపదవిదప్పకు మనియె॥ వినవయ్యా॥

౨. ఈవిశ్వకోశములోనా। దేవా నీవుసృజించినవానా। జీవులలోపలనేవానిచేతను, చావులేకుండగ నీవేయని కోరే॥ వినవయ్యా॥

౩. నరులునుసురలునసురలూ। సిద్ధగరుడగంధర్వకిన్నరులూ। ఉరగులు మొదలగు బరగువారలచేత। మరణములేకుండ కరుణింపుమని వేడే॥ వినవయ్యా॥

౪. గగనమందునభూతలమునా। రాత్రిపగటియందు నలోనవెలినీ। అగకప్రాణులచేత విగతప్రాణులచేత। తెగకుండవలెనయ్యా దీనశరణియనె॥వినవయ్యా॥

౫. ఘనతరాస్త్రశస్త్రములనూ। నాకు గాసి లేకయుండవలెనూ। వినుము కురుమద్దాలి వేంకటాచలదాస। వినుతుడంబున

హరికి, వెనుకదియ్యనని యె॥ వినవయ్యా॥

నారోజు రాగం—ఆది ౧౨

శశికులవారిధి శారదచంద్రా। విశదభాస్వదసదృశగుణసాంద్రా॥
ఈ—కుశభవభవులిటు గోరికొనికనక। కశిపుడు మరియుగ్గడించెవిను
మో॥ శశి॥

౧. ఒక్కడంతటికి నెక్కవతానే। తక్కనరులుతనకు తక్క
వగానే।చక్కగనేకచ్ఛత్రవిభుత్వము।గ్రక్కునరక్కసుడొక్క
టివేడె॥ శశి॥

౨. కోరినభంగినికోరికెలెల్లా।నారకసుహృదయమురంజిల్లా।
వారకనొసగి సరోరురుహ భవుడును।తోరముగ నతనితోనిట్ల
నియెను॥శశి॥

౩. ఈరీతివరములుకోరినవారూ।ధారుణివెతుకగదలచినలేరూ।
కోరికలరచే కూరెనీకనుచు।నూరడించెపలుమారును దయచే
॥శశి॥

౪. పదపడిదనుజుడా బ్రహ్మకుభక్తి। గడురగబూజించె కరను
నురక్తి।సదమలమతిసుర సన్నుతుడైనిజ। సదనమునకు భాషా
పతిజనియె॥శశి॥

౫. ఇలకురుమద్దాలి కులపద్మహేళీ। విలసిత వెంకటాచలదాస
మాళీ। జలనిధిశశియగుజలజనయనుతో। చలముబూని ధనుజ
పతియుజనియె॥శశి॥

కల్యాణి రాగం-ఆది. ౧౩

నీరజాక్షపదనీరజసేవా। నిరతహృదయ వినవే॥

ఉ—మేరమీరస్వైరచారియైయమరారి। ఘోరదారుణ౧ల వరలెను ॥నీరజాక్ష॥

౧. నరులసురలకిన్నరకింపు రుషుల। గరుడయక్షరాక్షసగంధ ర్వుల। ఉరగసిద్ధసాధ్య చారణాదులమరియు। మరియుదరమి దరమినురిమెను॥నీర॥

౨. ఈకరణిని లోకములనువీకన। నేకభంగులను వ్యాకుల మందజి। కాపుపరచి భీకరాకృతినిదా। నేకడంక నేకషిభుత జే కొనె॥నీర॥

౩. పాపమార్గ దీపకుడగుదనుజుప్ర। తాపమునకునోపకానుప ర్వులు। ప్రాపుదాపులేక నతనికడపడు గాపు। లుండిరేపు మాపుగొలిచిరి॥నీర॥

౪. హీనగతినిదీనదశను బొందీ। హానిసన్నిధానమున నే చేరీ। గానములను నేను తుంబురుండును। మానసంబులోన మెచ్చ జేతుము॥నీర॥

౫. పలువిధములనలిగి దివిజులిలపై। నిలువనలవిగాకతలకుచును భూ। తలమున కురువద్దాలి వెంకటా। చలదాసనుతునిదలచు చునుండిరి॥నీర॥

కేదారగౌళరాగం-అట ౧౪.

ఇందిరాధవదివ్యసుందరాపాదార, విందషట్పదవినవే॥

ఉ—బృందారకరిపు। డందర గెలిచితా। నొందెత్రిలోకమహాన్న తపదవిని॥ఇంది॥

౧. చెలగుచు దేవేంద్రు। సింహాసనముపైని, బలసికొలువై

య్యుండగా। అలుకునొందుచు కాను। కలనిచ్చె మ్రొక్కి చే। తులు
గట్టుకొనినిలది। కొలుతురు సురలెల్లా॥ఇందిరా॥

౨. క్షితినిషిప్రాములుజేయు యజ్ఞములందు వితతప్రాజలనొం
చుచూ। అతులహవిర్భాగ। తతులుదానెకొంచు సతతముఖం
డశాసనుడై వెలింగెను॥ఇందిరా॥

3. ధరణిమన్నకపండెతరువులు ఫలపుష్ప। భరితములైయొప్పె
నూ। కురియుచుండెనభము। కోరినకోర్కెలు తరగలజలధు
లుదాల్చెరత్నములను॥ఇందిరా॥

౪. మదిరాపానాతి। మత్తులైయుండగా।కదసిగంధర్వామలూ
యెమరబాడుచునుండ నింపుగరంభాది సుదతులాడుచు వా
నిసొక్కగజేతురు॥ఇందిరా॥

౫. అమరులెల్లనప్పుడతని ఘాటికినోడి। సుమహితాంతరంగు
లై। విమలమరుమగ్దాలి వెంకటాచలదాస, సముధికదైవము శర
ణముబొందిరి॥ఇందిరాధవ॥

బిళహరిరాగం-అట ౧౫.

కుంతీవరతనయా। వినవెశౌరి। వింతాభ్యుదితనయా॥

ఉ—అంతటసురలు మరంత వేదనాక్రాంతులైకమలా। కాంతుడున్న
ట్టిది। గంతరమునకు శాంతిమ్రొక్కియు। నంతరూపముచింత
జేసిరి॥కుంతీవరతనయా॥

౧. వినువీధినుండి దిగ్వ్రాతములన్నియుబ్రతి। ధ్వనిదోపమేఘుని
స్వనలీలసుజనజీ। వనమైన యొకదివ్యవాణి గంభీరమై।సనమ

శ్చెనో హ్లాదిపిజులార భయమేల। వినుకొనుగను దను
జనపవదేమునకుపేడిక గనుకురణాసుని ॥కుంతీ॥

౨. మొదసే వేదములందు। మునులందు గోప్రవు। జనులందు సున్న
ర్త్య। సమితియందును సాధుజనులందు నాయందు సతత మెవ్వ
డు ద్వేష మొనరించునపుడెనా। తన మొందు వాడు గా। వునిట
భము గలుగునికి సహాయే ప్పణపరతగనుడనుచు పురయును
॥కుంతీ॥

౩. వినుము కుందురు సుద్గాలి వెంకటాచలదాసు। ననుకరింపుచు నా
కునతి భక్తుడగుతన। తనయుడు ప్రహ్లాదుడను మహానుభావు। గ
నియోర్వకేపుడెగ్గు। గాపించునపుడెయి। దనుజు ప్రాణము
గొనియెదనునై। స్తంభములలరగ। జనుడనియె హరి॥కుంతీవర
తనయా॥

సౌరాష్ట్రరాగం—అట. ౧౬

భారతవంశపవిత్రా। వినవే। పాండు మహారాజపుత్రా॥
ఉ—సారసాక్షదయారసపాత్రా। సంతతాభిజ్ఞజనవనచైత్రా ॥భా॥

౧. చారుసుధారసధారలమీరిన। శౌరిపలుకులకల తదేరిరిసుర
లెల్లా ॥భారత॥

౨. అతిపాపుడైనయాదితిజాధమునపుడె। హతునిగదలచి। సన్ను
తినూరడిల్లిరి॥ భారత॥

౩. వెలయకుర్కుద్దాలి వెంకటాచలదాసు। వలెను లక్ష్మీనాథుద
లచుచునుండిరి॥ భారత॥

నాదనామక్రియరాగం—ఆది. ౧౭

మంగళం శ్రీమంగళాద్రిమందిరరాజయా। శుభమంగళంబాహాం
తరస। మాహితేందిరా॥

౧. నారదాదిముని వినుతపా। దారవిందా। కుంద కోరకరద
నాళీకజితసార బృందా॥మంగ॥

౨. నిఖిలహేయప్రత్యనీకనిత్యపావనా।భక్త సుఖదకళ్యాణైక
తానా। సుజనజీవనా॥మంగ॥

౩. శ్రీలలితాంతర్వేదిల। లక్ష్మీనృసింహా కుర్మస్థాలి వెంకటాచల
దా। పావనరంహా॥మంగళం॥

2 ప్రకరణం.

సెహానరాగం. అట ౧

అవనీధవ నీవవ ధరించవయ్యా॥అవనీ॥

ఊ—భువనైకజనస్తవనీయునయ్యా॥అవని॥

౧. సుతులునల్గురాదట జేశునకునుము। రతిధీయులుదారులూ।
అతిశుభగుణమణి యందగ్రజుండును। కృతిశాంతుడతిదాంమ
డూ। సతతమునిశితమతియుతుడు ప్రహ్లాదుడూ। కృతవిమతుడుప
వరిహితకరుడు నిక్షేమతూ। శతమఖముఖవినుత యశుడు
సూన్నృతచరితుడు పిరతజితేంద్రియు॥డవని॥

౨. సకలభూతములకు సమచిత్తుడుప్రియ। సఖుడుకామవిముఖు
డూ। ప్రకటసూరిజనసే। వకుడు దీనదయాళుడకలంక హృద్

యాళుడూ। సుకరగురుచరణ కమలకలితచిత్తుడూ। వికలితక లుషనికరనిర్మలవృత్తుడూ। వికలఖలదనుజకులఘోర। ప్రకృతి రహితుడు సుకృతిరహితుడు॥అవనీ॥

౩. ధరణిలోకురుమ। ద్దాల్ వెంకటాచల। దాసునహృద్వా సునీకరివరముని।పీతకౌశేయవాసుని। సురుచిరదరహాసునీ। క రిమరుమగురుభక్తి మనమునగాంచుచూ। గిరిసుతత్పద సరసి జంబుల నెంచుచూ। పరగెనురుతర పరమసుచరితనిరతుడైతది తరవిరతుడై॥అవనీధవ॥

ముఖారిరాగం—రూపకం ౨.

ఎన్నగదరమానాఅల। పన్నగపతీకైనా। హరిహరి॥

ఉ—అన్నన్నవినవేశ్రీప్ర। స్తామని సద్గుణసముదయ॥మెన్నగ॥

౧. సుమహితమతిబ్రహ్మణ్యుడు। సుభగశీల సంపన్నుడు।విమ లగురు జనంబులయెడ। విశ్రుత పరాద్వైతబుద్ధికమనీయుసు జనసే వా। కలితుడుమరివిషయాంతర విముఖుడు దృఢసత్యరతు డువిజితవైరి షడ్వర్గుడు॥ ఎన్నగ॥

౨. అభిజనవిద్యావిత్తా। ద్యభిమానవి దూరుడుబహు శుభచరి తుడుపరమవి। శుద్ధాత్ముడు ననఘుడుచు। ర్లభములనగ నొప్పె డు సకలసుగుణములతనియందే। అభి వృద్ధిజెలంగుచు గుమ రైతోచునుగామవపడక॥ఎన్నగ॥

౩. సతతమును సభాంతరముల। సత్కథలు బ్రసంగించుచు।మ తిమంతులు। జ్ఞానులకుపమానము గనుదను నెంచగ। వితులిత

కురుమద్దాలీ। వెంకటాచలాంఖ్యగాను। మతని జెలగినట్లచ్యుతు డతనియదిని జెలగు నెపుడు ।ఎన్నగ॥

భైరవి రాగం—అట. 3

భరతవంశభూషణా। వినవయ్యాయీ। చరితముఃరిపుశోషణా॥

ఉ—నిరతమునిజభవ్య। సురువిరమానస। సరసియంపు లక్ష్మి। ధరుని దివ్యపాద। సరసిజయుగమూ। బాగుగనిల్పి మరచెనిజగమూ। యెవ్వరువానిసరియనదగమూ॥ భరత॥

౧. ఆసనుడగుచూ। శయనించుచు। గ్రాసముగొనుచూ। హసా మొంచుచు। ముత్సటాడుచు దిరుగుచు। శ్రీసఖపదసక్తచిత్తుడై యెరుగడు। చేసినపనులా తెరువడయ్యా మూసిన కనులా। తె లియడయ్య డాసినజనులా॥ భరత॥

౨. ఆడుసునొకచో హరికీర్తనల్। బాడునునొకచో। యేడుచు నొకచోటనింతంతయని జెప్ప। గూడనియార్తిచేగోవింద యాప ము। వీడక కాంచీ। ఆనందసంక్రీడనమించీ। భవదవ వహ్నివేడి మిద్భంచీ॥ భరత॥

3. గంతులువైచూ। నొకొ్కకచోని। శ్చింతుడైతోచూ। వింతా గ కురుమద్దాల్। వెంకటాచలదాసు। నంతవానికె డెలియ నగు నాతనిచర్య। శాంతిభాసురమూ।ఆమోదితస్వాంతభూసు రమూ। సంతతవిని, కృంతితాసురమూ॥ భరత॥

శుద్ధసావేరి రాగం—అట. ౪

వినవయ్యాజనపాలా। శ్రీహరిపాద। వనజార్చనసీలా॥

అ—తనుజునితనగురు తనయులకడనుంచె। దనుజేశ్వరుడువిద్య గొ
నుచ్చైయుబలికెద॥ వినవ॥

౧. గురుపుత్రులాతని గొనిచనియతనితో। మరికొందరసురబా
లురగూర్చి। వరుసమీరంగాద్రి। వర్ణపాఠములను పఠనసేయు
తోడగ్రజ్ఞులుగుండిరి। గిరిభిదరి వరసూనుడు జెప్పెన్। కిరణినే
మరక నేరి జదివెను॥వినవ॥

౨. చండామార్కులుజెప్పు చదువులన్నియతడు। నిండారుమ
నమున నెనుకేజూచి। ఖండశర్కర బోలె కనుపించునివిమున్న
చండవిషయుతోడ సమములౌనుగుదికి। పండితులు దండిమతి
చెప్పని। బెండులని యుండుమురని దలచె॥వినవ॥

3. విశదసుమద్గాద్రి వెంకటాచలదాస। వశుడైన హరిపాదవ
నజయుగమూ। భృశముగహృత్పద్మ పీఠమునిలిపి యశము
జెందగ భక్తివర్ధించు నారికి। అశుభపశుకర్మకరులెల్లసమృశు
లుబానిసులని దలంచేను॥వినవయ్యా॥

ఆనందభైరవి రాగం—అట. ౫

శాంతిదాంతినితాంతానిశాంతా జగతికాంత వినవే॥

అ—సంతతకమలాకాంత పదాబ్జా। స్వాంతకీర్తి సంక్రాంతదిగంతా
॥శాంతి॥

౧. అంతగొన్నిదినంబు। లరుగశంకాన్విత స్వాంతుడైసురవైరి।
గురువలేకాంతమందేదారి। చదివించిరో భ్రాంతుడుల్లగోరి।
చదివెనోయనిచింతించి వగసూరి। విద్యాపరిక్రాంతి జూచెద

గాక। చతురతననుచునే। ధాంతర సేనుగానందను। నంతకం బునను రప్పించెను॥ శాంతి॥

౨. ఉత్సాహప్రభుమంత్రి। యోగయితోద్యోగి। విద్యాసృష్టిడవై తివె। వేదశాస్త్రి। తత్వార్థజ్ఞుడవైతివే। అరూపసం। విద్వాంసుల్న డవైతివే। త్రివర్గసి। ముత్సుకనాటడవైతివే। అనుచుబ్రజేసి। విత్సార ల్పనిసిరి। యుత్సంగమున జేర్చి। ఉత్సవంబుగ సకలవిద్యా। మాన ప్రాప్తుడవైతివే యని॥ శాంతి॥

౩. పంకజాక్షుభక్తి। పరమరుమార్గాలి॥ వెంకటాచలదాసునీ। యె ప్పుడిద్రి। వెంకటాచలవాసునీ। భాసురనిమ్ర। లంకమండిపో సుని। దాసబృంద। పంకజాలనివాసునీ। తలచేడివారివంకబో వకుండ। వర్తింతువేపుత్రశి। వంకర౧ బుగనీకునెయ్యది భద్ర మై యున్నదియొ చెప్పుమనె॥ శాంతి॥

కాంభోజిరాగం—అట. ౬

రమణీయగుణశ్రీ। రమణాంఘ్రియుగళాపి। రమణభావపినవే॥

అ.—సుమహితగతినితండ్రికా। శిరసూనుడిట్లనిపలికె నంతట॥ర॥

౧. ఎల్లశరీరధారులకును భువినిల్లను భ్రమగలనీ। వెల్లగుచీకటి। పెనునాతిలోపల। ద్రెళ్లకసమానుటనీ। అల్లనపీరునే। మానిభిన్ను లై ప్రవర్తిల్లక పిన్నుని దివ్యకాళాపాయ మెల్లవిశ్వము వేరు లేదని యుల్లమున నాతని దలంచుచు మెల్లనెతారడపినుండుట మేలురాత్రి। చరాగ్రణీయవే॥ర॥

౨. అట్టిభంగిబాలు। డాడినప్రతిపక్షానురూపముతైనా। యట్టి

పలుక-లువిని। యసురకులాధిపు। డచ్చెరుపడిలోనా। ఎట్టులా
డి తెరట్టులె పలుక-ము।రితరులైన బాలు।రిట్టిట్టులన లేరు।గట్టి గా
ధట్టి।చియివ్వరో। గాని యీగతి మస్తనుతులై। పట్టుగాపిసికని
యీపర।పక్షములు బట్టించిరనుచును॥రమణీ॥

3. నాకునుజూడగ। చోద్యమయ్యెడిని। నాతండ్రియీరితీ।నీకె
తోచెనో। పరులెవ్వరేనియు। నేర్పెనోమర్నితీ ఏ కాంతమునగు
రువు। లేచెప్పిరోకాక। వైకుంఠుడీదానవ్రశేణికపరాధ।వీకకురు
మద్దాళికులభవ వెంకటాచలదాసుకైవడి। నీకునలవైకుంఠు
నిన్ ఎణిక-ంప నేటికి రాయిఒంచ నె॥రమ॥

పున్నాగరాగం—ఆది. ౭

బేలతనమిదేలవచ్చెరా।ఓరోత్రిమూఢా॥బేల॥

ఉ—చాలురాపనికిమాలినపనివన। మాలియనుచుగిన మాలియనుచు
నిటు॥బేల॥

౧. పురవరములుదగులబెట్టుటో। మునివరులనసుర। వరులబట్టి
కట్టికొట్టుటో। పరసతీమణులచెరలుబెట్టుటో। హరిహరియను
చును గిరిగిరియనుచును॥బేల॥

౨. న్యాయమార్గములు గలంచుటో। దేవాలయములు। నేయడ
లనువిడల్చించుటో। పాయకసాధులబాధించుటో। నారాయ
ణుడని గీరాయణుడని యిటు॥బేల॥

3. వేదములనూపాతిపెట్టుటో। చలివిందరలలో।మీదమీదరా
ళ్లుగొట్టుటో। నాదుమతము మదిలోదలపక। దామోదరుడని

గీ మోదరుడనియిటు॥ బేల॥

౪. సారధర్మములనుగ్రచ్చుటో। బాహ్మణులయగ్రహారములనూ। చూరబుచ్చుటో। క్రూరగతి జగముగారింపకయిటు। సారసాక్షుడనిగిరసాక్షుడని॥ బేల॥

౫. శంక లేకనన్ను మీరీ। అలకురుమద్దాలి। వెంకటాచలదాసు జేరీ।పాంకముగహరినిబొగడిననాతడు। పంకజాలములు బాపునటంచును॥ బేలతవ॥

తోడిరాగం—ఆది. ౮

వీతనయశాతనయసమకుం। తీతనయవినవే॥

ఉ—తాతపలుకుల ప్రీతితోవినివి।నీతిగురుతనూ।జాతులగనియానే॥వీత॥

౧. పరమాత్మ తత్పరులగుచు నెలుక। మెరయుచున్నగొందరు తాసీ। బొరయుపురుషులువి। మోహంబునుని। ధ్యానంబుగ దెగగోసీ। అరివి నేముదామ నెడి యసద్గాగ్రీ। హ్యాఃగు భేదమా తినెడబాసీ। పలుదురితంబులు దిగద్రోసీము। స్తంకర్మములు కోసీసం। సరణసరణి వదలరా పరాపరపరున కెనమస్కరింతుననుచును॥ వీతనయ॥

౨. అజ్ఞుల్ గొందరు నే మఃదామనుచు। నచ్చపుమాయంగలసీ॥ ప్రజ్ఞాలభ్యునిపరమాత్మునిహరి। బ్రస్తుతింపనోపరు తెలసీ। ఆజ్ఞాసక్ విధిశివాదులగు వే। దజ్ఞులైన మూఢతబలసీతా। విజ్ఞలౌచురటయలసీస। ర్వజ్ఞునిహరిగనవలసీశా॥ సర్వజ్ఞులును తెలియ। జాలరు కేవలనజ్ఞానుల కెట్లలవియగుననుచు॥ వీతనయ॥

3. శ్రాంతింగురుమద్దాలి వెంకటా। చలదాసుడు ముదమున దే లా। వింతయునుమయ స్వాంతమనేడు। శిరచెంత నేపగిదిచే జాలా। భ్రాంతంబగు దైవయోగమున మద్భావంబును నాగ తిబోలావిశ్రాంతిగనక దృష్టిదూలా వలుగంతులిడుచుఘనలీ లాసం। క్రాంతమై నిరంతరంబునురమా। కాంతుచెంతగరగు చున్నదనుచును॥ సీతనయ॥

కేదారగౌళరాగం—అట. 

అంబుజోదరది। వ్యాంఘ్రిసక్తచిత్త। మన్యజనులగోరునే। వార లసూరి। మాన్యులనుచు జేరునే॥

ఉ—శంబభరణగర్వ। డంబరహరణని।జంబుగనమ్ముమ। నంబుననావ లుర॥ అంబు॥

౧. లలితరసాలపల్లవఖాదియైపొకుర। అలకో వెలమెకురనే। కు టజములనుఅందాకులు మెకురనే। పాలుపొందు చంద్రికాస్ఫూరి తచకోరకంబరగునే సాంద్రనీహారపూరములకు॥ అంబు॥

౨. మందాకినీవీచులందూ గురాయంచ। పొంమాగదాఁనునే। కాలువలకు। అందుసుఖముగనునే। మందారమకరంద మా ధుర్యమునదేలు। మధుపంబుబోవు నేమదన సంఘములకు ॥అంబు॥

3. జలధరనవధారాస్వాదియై మోదించుచాతకంబుబోవునే। చాటపెడకు। క్షారోదకముద్రావునే। అవనిలోకరుమద్దాల్యే న్వయభవ వెంక। టాచలదాసాప్తులల్పాల గొలతురే॥అం॥

వంతవగాళి—త్రిపుట ౧౦

వోపార్థివేంద్రా। సుజనాబ్ధిచంద్రా। దీపితగుణసాంద్రా॥
ఓ—ఆపలుకులనువినికుపితులై। యాపురోహితసుతులుపలికిరి॥ఓ॥

౧. ఎంచబంచ శరద్వయస్కుడవు। యించుకయిలేవువ। చించెదవు తర్కములుబాలుడవుసంచితంబుగ మేమిుజెప్పిన। శాస్త్రములలోని యర్థం। బొకింంచుకయునను రేంద్రముందట మంచిగాభాషించవైతివి। చంచలమతివైతివి మాకునాదలలూపంచుకోజేసితివి। కపటవేషంబున। వంచకుడవైవైరిభూషణ। వంశభూషణయనుచు మరిమరి॥ వోపార్థివేంద్రా॥

౨. అనయమును శాత్రవుడు వీడూ। దానవేశ్వరునకు దనరగను తనయుండుగాడూ। దనుజులారా దనుజచందన వనమునను గంటకసమెతా। వనిజమనగనుబుట్టినా। డనవతరము రాక్షసకులాంతకు పనిగాప్రస్తుతించునూ। అన్యులంటేఘనమున గహించునూ। నిశితమగు దండనమునన కానిక చెప్పినట్లుగ వినడు। పట్టుడు కొట్టుడనుచును॥ వోపార్థి॥

౩. శంకలేకిటుబాలున దిలించీ।నిశిచరకులాబ్ధీశ। శాంకుసన్నిధినుండికదిలించీ। పొంకముగను రహస్థలికిగొని। పోయియాబాలుకురుమర్ధాల్। వెంకటాచలదాసపోషకు। వంకబోకుండ పలుమారుని। రంకుశగతిమించీ। త్రివర్గము। నంకించిబోధించీ। నిజమను మనుతిలోన। నింకనీతడు నీతిపారగు। డింపుగానవ్వైనవితలచెను॥వోపార్థివేంద్రా॥

నాదనామక్రియరాగం—ఆది. ౧౧

హరిపదరాజీవరాజహంసమ్మావినవే। అరుదారగనరవరా న్వ
యావతంసమా॥

గుణతనయుల సురబాలుని మరియుమరియు శిక్షించిరి॥హరి॥

౧. భార్గవనందనులతనికి పట్టేమియుగదలకా। మార్గము జెడ
కుండ పెక్కుమారులుచేవదలకా। వర్గత్రితయంబునునంతర్గా
థపిలగ్నముగన। నర్గళమగుమతివిశేషమ మరునటులబోధిం
చిరి॥ హరిపద॥

౨. సామదానభేదదండసమితి నెరిగించీ। ఆమేలపునీతివేది
యియ్యోనితలంచీ। ప్రేమమీరతల్లికి సంప్రీతితోడ నెరిగించీ।
ఆమెచెనలంకారంబమరించీ యిటనిపలికిరీ॥ హరిపద॥

౩. త్రిప్పకుమన్నమామతము తెలివితో త్రివర్గమూ।తప్పకుమన్న
మేమునీకుజెప్పిన యామార్గమూ। విప్పకుమన్నకురుమద్దాల్
వెంకటాచలదాసనుతుని। తుప్పుడుకధలని తెలుపుచు। దొర
యెద్ధటికి దోడ్తెచ్చిరి॥ హరిపద॥

యమునాకళ్యాణిరాగం—ఆది. ౧౨

ధరాధరణచూడామణీ। ఇందిరారమణ భక్తాగ్రణీ॥
పరాకులేక వినవెనరవరని। ర్భరాదరమువగలగ వినుపించెద
॥ధరా॥

౧. అనుగడుగున బొల్పగుమాధవపాదానుచింతన మునా। త
డబడకనుతులసుధారసపూర సముద్రావినచందమునా। వడలు

మరచుచుండెడు వానిగురుని। కొడుకులలసభకుగొని చను
దెంచిరి॥ ధరా॥

౨. కనుగవకుని తరకాంతలగుపడిన। వినయమెనయమెలగి। త
నదుమనిమునను తల్లులనితలచి దండమిడుచుదోలగి।చనెడువా
నిసజ్జనహితచరితుని। మొనసితండ్రి సమ్ముఖముననిలిపిరి॥ధరా॥

౩. అంభోజప్రభవాదులకైనను। నభ్యసింపరానీ। శుంభద్గతిహ
రిసుభగభక్తిధా। పుంభావముబూనీ। సంభవించెననజనుమహా
త్మునిని। జృంభితగతి తండ్రికిమ్రొక్కమనిరి॥ ధరా॥

౪. వివిధగతివెలయు విశ్వమంతయును। విష్ణుమయంబనుచూ।
నవనవాద్భుతానంద బాష్పపుల కలితానముగొనుచూ। దివి
జతుల్యుడగుధీరునితండ్రికి సవినయంబుగనుసాగిలచేసిరి॥ధరా॥

౫. తలపునకురుమద్దాలి వెంకటా। చలదాసవినతునీ। చలచిత్తు
భవతుక్కలవిద్వేషిని। జలరుహాలోచనునీ। తలచకెపుడుమీతం
డ్రియాజ్ఞలోమెలగుమా యనుచు పలుమరుదెలిపిరి॥ధరా॥

రేగుప్తిరాగం—ఆది. ౧౩

మగళంశ్రీరమాచిత్తచోరా। మంగళాచలశృంగవిహారా॥

౧. వేదవేద్యపవిత్రచరిత్రా। మేదురాఘతమిస్రాబ్జమిత్రా। ఆది
మూలఫలాశజాలవీ। భేదపృథులీ।లావిలోలా॥మంగ॥

౨. నవపయోదసుం। దరనీలదేహా। కవిజనార్చితఖండితమో
హా। భువనమోహన। గరుడవాహన। పురుషవరసర్వావగా

హన॥మం౦గ॥

౩. భవమహిరుహపా। టలకుతారా। దివిజసన్నుతది। వ్యావతారా। అవిరళదయా। వివశహృదయా। సవినయపిభాస్పదభ్యుదయా॥మంగళం॥

౪. కటితటీలస। త్కాంచనవసనా। కుటిలశాత్రవకోటిని రసనా। వటదళశయన వారిజనయనా। పటుతరజగద్భాస్పదయనా॥మంగళం॥

౫. అమలమణికిరీటాదివిభూషా। ఆప్తజనమనో। హరమృదుభాషా। విమలకురుమద్దాలి వంశజ। వెంకటా। చలదాసపాలక॥మంగళం॥

౩ ప్రకరణం.

రేగుప్తిరాగం—ఆది. ౧

వినవయ్యజనవర్యా।విపులకుధరధైర్యా॥విన॥

వనజాతనయనశ్రీపదవనజాతహితపరిచర్యా।దనుజశాబకుదుజనకునకునువం। దనముజేసి నిలచెనతనిమ్రోలను॥

౧. మ్రొక్కినప్రియతనూజాని। రక్కసూలనాథుడెత్తి। పెక్కుదీవెనెల్లోసంగిఅక్కునజేర్చి। చిక్కని వేడుక। చక్కనమదిలో। వెక్కనతోడపై। గ్రక్కునవిడికొని। మక్కువమిక్కిలి పిక్కటిల్లగను। చెక్కిలిముద్దుచు శిరముమూర్కొనియె॥వినవ॥

శాల్లాశాలమునుండి। వదమువుమంటివేమేమి। మేలివిద్యలు

గణించి। మెరసినాడవో। పాలకయించగువద్య మొకటిమ్మృదు లీలనింపుగొనచాలు మధురసము। జాలుగొనునటులవదివి యా ర్థ యివి। శాలముగ దెలిపి చతురతగనుమనే॥వినవ॥

3. తనునిట్లుపలికిన। జనకునిపలుకు లెల్లా। వినిదానవార్భకుడు నువిమలమతితోడా। తనరగకురుమద్దాలి వంశశుభ। జనక వెంకటా। చలదాసావను। వనరుహనయనుని। మనమునపడు కొని। వినయమెనయ నిట్లనిపలికదొణగ॥వినవయ్యా॥

కమాచిరాగం—అట. ౨

వినవేదనుజాధిపా, నామనవి। వినవేదనుజాధిపా॥
అనిశమును నెమ్మనమునకునతిహర్ష మొదువగ విన్నవించెద॥

౧. చదివించిరిగురువులూ। ధర్మార్థకాముఖముగ। జదివితిశాస్త్ర ములూ। నేచదివినచదువులుగలవు విచారింప। పెక్కులుచదు వులనుగల మర్మ మెల్లను చదివితినిగదయ్యతండ్రి॥వినవే॥

౨. శ్రవణముకీర్తనమూ। శ్రీవిష్ణుపాద నవకమలార్చన మూ। మొదలుగాగ। నవవిధభక్తిని। దవిలిగొలువకున్న భవమహా ర్ణవపార మొందగ నెవరికైనను నలవియగువా॥విన॥

3. వేంకటాచలదాసునీ। మహనీయాక। లంకసుందరహాసునీ। కురుమద్దాలి। వెంకటాచలదాస వినతుని ప్రేమచే। పొంకము గసేవింఛి శుభములు పొందవలేనని పలికె దృఢముగ॥వినవేద

సురటర్రాగం—ఆది. 3

దోషాచరవరేంద్ర వినవే। రోషమునువదలీ॥

శేషశయనుడైనహాటకాంబర వేషిపైనిబూనిలేనిపోని। దోషములుభాషించిపలుమరు। పాషండమతిని జెడగనేల॥దోషా॥

౧. తనుహృద్భాషలు సఖ్యము శ్రవణముదాస్యమువందనమూ। మననము సేవయు। నర్చనమును కీర్తనమునుచింతనమూ। అనునీతొమ్మిదిభక్తిమార్గముల। నఖిలాత్మకుహరి నమ్మిమిగుల సజ్జనులైయుండుట భద్రమనిదలతు సత్యముసత్యముదైత్యకులోత్తమ ॥దోషా॥

౨. అంధేందూదయములు నుబధిరశంఖారావములునూ। బంధురకృతఘ్న బంధుత్వంబులు భస్మహవ్యములునూ। సంధిలగనపుంసకయువతీ। కాంక్షలును లుబ్ధధనములు సూకరసద్గంధములునుహరిదాస్యవిరహితులదంధనాలువ్యర్థపువర్తనములు ॥దోషా॥

3. తాలిమిలేక నితరగాధలుబ్రా। ల్మాలకనాలించీ। యేలనధోగతిపాలుగాగననిహితము మదిదలంచీ। తాలిమికురుమద్దాలికులవిభవ। శాలీ వెంకటాచలదాస హృదయలోలుడైనశుభశైలలవిభునిపద। నాళికములనునమ్మగదయ్యా॥దోషాచరవరేంద్ర॥

సావేరిరాగం—ఆది. ౪

వోయయ్యవినవయ్య నాదినినసూయావదలీ॥

ఏయడలనీయొడలు బడనయుజేయుపని కేయదుకవలదా॥

౧. అనుదినకుసుమసరములరగగమాలా। భ్రమునినర్చించెడి కరము లుకరములు। తనరశేషశయను నకినవరతము। వినయమెనయ మ్రొక్కెడిశిరముశిరము॥వో యయ్య॥

౨. గురుభక్తిబరగసురరక్షకు భాసురగతిజూచెడి। చూడ్కు లుచూడ్కులు। పురుషోత్తముడని బొగడుగనినయాన్వితరదవ రతమిదిబుద్ధిబుద్ధి॥వో యయ్య॥

౩. పలుగతులబోక భగవంతునకును। వలుమరువలగొనుపదము లుపదములు। చెలువుమీరగనుశ్రీనాథునిమది। జెలగుచువర్ణించెడి జిహ్వజిహ్వ॥వో యయ్య॥

౪. తనువుర పులకములెనయగవిష్ణుని। వినగాంక్షించెడి వీనులు వీనులు మొరసిదనుజదమనుని మ్రుమపదనవ। వనజములనుద గిలినమనముమనము॥వో యయ్య॥

౫. అలపరదైవము దెలుపుగురుడుగురు। డలరగహరిగనుతాను తండ్రితండ్రి। ఇలవురుసాగ్దాల్ కులజ వెంకటాచలదాసుచెలి మిగల। నరులునరులు॥వో యయ్య॥

జంఝోటి రాగం—అట ౫

దివిజశాత్రవవంశదీపక వినవయ్య। రవిసమతేజపరాకు లేకా॥ కవివంద్యనమగాని। కాయంబుకాయమె। పవనకుంభితచర్మ భస్త్రికా గాకా॥దివిజ॥

౧ ఘనవర్ణుజూడనికన్నులుకన్నులె। తనుకుడ్యజాల రంధ్రములు గాకా। అనఘుబూజించని హస్తంబుహస్త మేతనరదాపురచి

తపస్విగాకా॥దివిజ॥

౨. సరసఖుబొగడని నాలుకనాలుకే। పరికింపగాతాటిపట్టె
గాకా। శరిజాక్షుగొలువని। జన్మంబుజన్మమె। తరళసలిలబు
ద్బుదంబుగాకా॥దివిజ॥

౩. హిరిహిసురుషస్ద్దాలి వెంకటాచలదాసా। పరమభక్తిచేనినరు
డునరుడే। ధరణిలోనతృణము గొరుకకదిరుగుచు।బరగునాద్వి
పాత్పశువుగాకా॥దివిజశోత్రన॥

కాంబోదిరాగం—అట ౬

సత్యముగానది సమ్మతించవయ్యా వైశ్యరాజాఆ। దిత్యనిచ
యఘాఢతిమిరని వారణాదిత్యతేజ ॥సత్యము॥

౧. సంసారజీమూతసంఘుంబు పిచ్చునే। సహంఘమాపరమ।
హంసగమ్యూరి గాస్యమనుమారుతము లేకఅసురసోమా॥స॥

౨. తాపత్రయాఖిల దావాగ్నులారునే। దానవేశా। లక్ష్మీపతి
సేనామృతవృష్టిలేకయమిత్రనాశా॥సత్యము॥

౩. అమితపిపర్గాఢతిమిరంబు దొలగునే। అతులశౌర్యాన
వ్యకమలాక్షవినుత భాస్కరదీప్తిలేక విక్రమణధుర్యా॥స॥

౪. సర్వంకషాఘౌఘజలరాసులింకునే। శమితవైరిశ్రీమ।ధుర్వ
ధరమనీషి కార్వాగ్నిలేకసురగర్వహారి॥సత్యము॥

౫. చెల్వుమీరముక్తి సేవకునొందునే। శిఖరిధీరా కరుణ్గా
వ్వేంకటాచలదాసుగూడ కనుదధిగభీరా॥సత్యముగా॥

బిలాహరిరాగం—అట ౭

వసుమతీధవవసు దేవతనయాంఘ్రి బిసరుహాభ | భృశిత్త
పినవే॥

అసురపీరుషుపుత్రు నాలాపములువిని। కసరుకొట్టుచుమిగు
ల। కాలుష్యమున జెందె॥వసుమతీ॥

౧. తొడసిదనున్నట్టి కొడుకునుక్రిందికి బడద్రోసికడువడి। చిడి
ముడిపడుచును। కడిదికోపముచేత కనులెర్రజేయుచును। తడ
బడకాచార్యతనయులజూచియో। చెడుగుమతులారయీబు
డుతను। వెడగుచదువులుగఱపియిటునా। కడసుదెచ్చితిరిత
గునాయీ। నడువడియటంచునదలించెను॥వసుమతీధవ॥

౨. పటుతరముగనీతిపారగు జేసెద। వటుననిపలికినీ। వటుదోడు
కొనిపోయి। కుటిలతతోడమైకొని విరోధశాస్త్రి। పటలిబోధిం
చియిచ్చుటకిదెచ్చితివారా। కటకటాబ్రాహ్మణాకారమే। కాని
నికరముబ్రాహ్మణుండవే। దిటముగా భృగుకులప్రవరుడ వట
నినమ్మితిననుచు బదరెను॥వసు॥

3. అప్పగిదినిబలుగ నప్పలుకులువిని। యప్పురోహితసుతులు
దెప్పగమగుభక్తితప్పులు లేవుమా। యప్పమావలనను। చెప్ప
మెప్పటకిని। నొప్పనిశాస్త్రముల్ చెప్ప రెవ్వరుక్రూరులైయా।
చొప్పునీతనయునకు నైజము త్రిప్పుమాసినేర్పు పెంపున లేరవు
దప్పకననుచు వేడిరి॥వసుమతీధవ॥

౪. అజ్ఞాల్మండంతనిజాత్మజుగనిబలెగ। ఒజ్జలుజెప్పకయున్న
యీమర్బుద్ధి నజ్ఞాతుడవునీకుమరియెవ్వరిచె। సుజ్ఞాతమయ్యె

నీయుర్వీతలముగో నాత్మజ్జను-జేరొ సుము శగునాపజ్జింకం పడపుపలదన। నజ్జనసుపలుకులను పిసియాపజ్జనాగ్రిణిబలుక దొరికొనె॥ వసుమతీధవ॥

౫. పొంకముమీరగ భూపకురువర్గాలి। వేంకటాచలదాస। వినుత కోమలపాద। పంకజాతుడుసిజ। కింకరకిల్బిష పంకవిశోషణ। పంకజబంధుడు। పంకజభవాదినుతుడగు। పంకజ క్షుని నిజపినాలపల్కి। త్వంకజంబుననిలిపిపటుతర। భక్తిభావము। వెలయగొలుచుచు॥ వసుమతీధవ॥

ఆఠాణ రాగం—ఆది. ౮

దేవా।దివిజచ్ఛటాలపీడావా। ధైర్యపిజితదివిజగ్రావా।వినవే॥ ఆపహించినపురాగ్రహమువదలి। భావమునను గడు పరిశుద్ధిబొదలి॥దేవా॥

౧. అచ్చపు చీకటిబడి గృహములలో, చచ్చుచు పుట్టుచునూ। విచ్చలపడిచర్విత చర్వణులై। మచ్చికబెట్టుచునూ। హెచ్చుగ దరిగడు నిలమానవులకు। చెచ్చరనెవ్వరు చెప్పినదారియె। మిచ్చినకానలకేగిననైనను। నచ్చుగ గలుగునె హరిబోధంబులు ॥దేవా॥

౨. మానుగగానని వానినూతగొని। మహినొకబ్రహ్మాడినీ। శ్రీనెలకొనగ విశేషవస్తువలు। కానసిగ్గైవడినీ। కానరు కొందరు కర్మవిబద్ధులై। కంజదళాక్షుని జెందగ సర్వ్య। జ్ఞానులకించన। వైష్ణవాంఘ్రిసం। స్థానరజస్సంసక్తులొందదరు॥ దేవా॥

3. శోధింపంబడెసకల శ్రుతులు। పరనాయకి దేవేశ్వరులా। గాథల నాశవ శేముషితరిణి। గతినిగ కవ శైలా। సాదనమ నిహశ్శ్రేయసుగవఘ౯। ఝుషసాహాయ గ్రవాంభానద మోహ క్రోధో ల్లోల విశాలసంపరణ। ఘోరాంభోనిధి। దాలవశమ గునె॥ దేవా॥

౪. వివిస్త్రిగౌణైశ్వర్యముగలిగెననుచు। వృధాహంకరించి। వాస్తక మువఁకునాదమెకో నాకుమారెవడని యెంచి। వాస్తవపు రుషార్థమిదయెయనుకొని నాస్తికుండనై చెడగానేలసమస్త లోకనాథుశ్రీహరిగొలిచి। నిస్తులానందనిధి గనవయ్య॥దేవా॥

౫. నరనారికరితురగరథాంబర వరాభరణములునూ। వివిధ గబరగెమ్మపీఠాయవసు వర్ణరజతగణములునూ। ధరగలవస్తువి తతులాకనికెచే। కురిసతృప్తిగాకొనడటుగావున, కురువగ్దా ల్వేంకటాచలా హ్వాయవరదాస వతదు గొలిచి సుఖింపవే ॥దేవా॥

మారువరాగం—ఆది ౯

మేరుధరధీరసకలధరా। ధౌరేయవినవే॥

అనురారాతిసుతు। నుడువులకుమది నపారమగుకో। పము బెరుగనతిక్రూరతరభాషణముల ఘోరా। కారులగు భటుల జూచియిటులనె॥ మేరు॥

• పంచాబ్దంబులవాడయ్యునునా। వతుమునిందించిన్గనహి తునికొంచనైనభయములేక పెనగిర్దుంచుచున్నవాడు బంటు

భంగినివల। సంచు నెంబోధించిననిది। మందిరకాలం చడమ్యో తనయుండుంచుగోగముబ। సించెపినినెన। రుంచకికవధించిరండుంచును॥ మేరుధర॥

౨. అగ్రాతమునంమమిగులమ। ప్రాంగము ఖండించీనేర్పనను శే। ప్రాంగరక్షణమొసంగు చికిత్సను। భంగినీయభమునిన్గలరూపను పలుభంగుల కేశవపక్షపాతిమ। స్నాంగుఃజ్ఞువడిజంపించిసము। శ్రుంఖ్యాతిజరింతుసులముని। ద్రోహముగనిలిపిపోషింతుననుచు॥ మేరుధర॥

3. వలమువలముపీని వసనికదయ। దలచుటెల్ల నిష్ఫలమువసమటే। తలముచరురుమ ద్దాలి వెంకటాచలదాసునివలె। జలజదళనయను। శ్చలతరభక్తిగొలుచుమన్నవా। డలఖుబలముదొలగక నెలకొని మిక్కిలి మొక్కలమునధికరించి విచ్చలవిడి। చలమునజంపిరండనుచు॥ మేరుధరధీరసకలధరా॥

బిలాహరీరాగం—ఆది. ౧౦

హాలీవినవేభక్తజితవనమాలీ। గుణశాలినిహతవిమతాలీ॥

ఈలీలదనుజేశుడుకోప। వ్యాలోలుడై యాజ్ఞాపించిన। కాలకింకరులబోలుదనుజులా। బాలుబోదవిశూలములను గ్రుమ్మిరి॥హాలీ॥

౧। ఘోరారపారిచనమబాహువు। లడ్డముగనిడమ బంధుజనులనుమారిమను చేరడును తండ్రిని తేరి। చీరడమిత్రుల ఘోరకృత్యముని। వారకమాత్మని। వాసగృహములకు తారడనుకావరేయునడును తాపమునొందదడు కంటగింపడను॥హాలీ॥

౨. బా గ కృపాలుఁడు జనిహిా శ। లోలుఁడు లోకమాన్యుఁ
డౌ బాలుఁడు। బాలుఁడనకనుఁడయి మాతీ పలవిధయింపగనుఁని
సి బాలుసిద మేలు గాదనకను। బాలకుఁడు పాలనను పలుకర।
వా ముులసు గొలములనుబోడి విరి॥హోలీ॥

3. గానపులు పలువురొకర్ సెట్టుగ। పూనుకొని బాలుని బొ
డుపనిం తేనియును వేలమక సుగంధము వేసూ। శోణితమురు
లములోసను శ్య్కి। తానమునఁ గడ। తాకి పసున్న శనముం హీ
నముగాను ముఖేందు కాంతియును। కానము కన్నులదీన భావ
ముసు॥హోలీ॥

౪. తన్నిటులనన్ని శచరులు బోడు వన్ని శౌట సుతుడుమాటికి
నినో। పన్నగశయా యోదనుజ। భుజనయోపరిమా పన్న
శరణయో సాపయించును। సన్నుఁ యెనలుపుగాని మరి హా।
కన్నులను నీరుదేడు సాష్పస కంపయుతుడుఁ గాడు చూడు భూ
వర॥హోలీ॥

౫. యింలీలసర్వలోకమయుశును। కాలాత్మ నవిష్ణునిజహృ।
న్నాళీకమును నిలిపి బ్రహ్మానందా। లోలతకురుహ హ్లాలికిలజ
ధీశాలి వెంకటాచలదాసవరుని। బోలి చెలగుచును। బొడగని
యాపురపాలకుడిటులని భావించెనదిని॥హోలీ॥

కళ్యాణిరాగం—ఆది. ౧౧

వింతనుచున్నది। పీని ప్రభావము నెంతనిదలపోతుఁ। సంత

తనును నే కాంక్షుడను| స్వాంతంబున నే చింతయుబూనడు ||పంలు||

౧. కాలకింకరులబోలునికౌటులు| శూలములనుకర వాలము లనుగొని బాలుబి దేహము| బలుపిడిబోడువగ| నేలపైబడుడు తూల జేసుయును||చింత||

౨. భయపడిదిశలనుపారిపోవడే క్రియ వేధించిన| కేవలము నుమర్త్యుసాయంబై చావందేవ్వని| పలునిందయి మోపుకుంకో పింపకు|| చింత||

౩. తాలిమితోడుతతండ్రినైననా| పాలవచ్చిహరిపక్షమువదిలి తిచాలుని ఎకననిచరణములకుదన ఫాలముసోకగ పనివడ్రమొ క్రొడు||చింత||

౪. కాయముసొవ్వముకారమురుధిరం| బాయాసంబింతైననుగ లుగదు| ఏయుపాయమున నేనియుపీనిక| పాయము జేయగ పనుపడకున్నది||చింతగు||

౫. చలన మొందకను సతతముధరిణీ| తలమునపురుమద్దాలి వెం కటా| చలదాసునివలె| జలజదళనయను| చరణయుగళమును శరముపదలడు||చింతగు||

పంతువరాళిరాగం—అట ౧౨

దరహాసనమా| దరవాక్యవృకో దరసోదరవివవే||

సుగ్రైవిరుడ। త్వరితిబాలకునిపైని। స్తరవిరోధముజెరుగ।
గజలికి। మరుసుబాధలబరుపదొరకొనె॥ దరహా॥

౧. దిక్కులభియూధంబు। దెప్పించిమొకమాటు। గ్రక్కున
డింభకుని। ద్రొక్కింపబంపున్। ఉక్కునవిషభీకరోరగశ్రేణు
ల। నక్కటకటయక్కుమారుని। పెక్కు గతిగఱపింపబంపు
ను॥ దరహా॥

౨. వసనురియొకమాటు। వహ్నిశిఖలలోన। విసరికుమారుని
వేయింపబంపున్। విసువకనొకమాటు।పితతోగ్రజలధిలో। కసిమ
సగిశాబకుని మొసళ్లులు। ముసరికొని తినముంపబంపును॥దర॥

3. గరళమిడగబంపు। కట్టబంపునుగిరుల। చరులద్రోయబంపు
శంకింపగా। పిరివికురువద్రాలి వెంకటాచలదాసు। డరుదు
గొనశిలశరని కరముఁలుబరచిదేహమునురుమ బంపును॥దర॥

కాఫీరాగం—రూపకం ౧౩

ధరణీమండలలలామా। వినవయ్యా సమాదరమునసుగుణాభి
రామా॥

మరిమరినిశిచరపతిని। స్ఫురమతి సత్వరగతినై॥ధరణీ॥

౧. ఒకవేళనతనభిచారహోమంబులు సేయించును। నొకవే
ళను నెండలలోనుండగ బంపుగ। ఒకవేళనువానలచే। నుప
హతినొందించును మరియొకొక్క వేళను సృక్కరంధ్రం
బు। లుకొగబట్టించి। చిక్కులబెట్టును॥ధరణీ॥

౨. ఒకవేళనుదనమాయల నొందవించుచు బెగడించును। నొక వేళను పెనుమంచుల నొంటెగనిలుపుర్ణ। ఒక వేళనుసుడిగాడ్పు లకున్ముఖుగగావించును। నొక్కటమంటిలోగృక్కించి త్రో క్కించు। నొక్కటనులులచే। మిక్కిలిచెక్కించు॥ధరణీ॥

3. నీరునన్నమిడనీయక। నిరసించునుగండశిలల।చే రువ్వించు న్నగదలవిదారణ మొనరించుర్ణ। దారితకవినుల కురుః ద్దాలి వెంకటాచలనా। మేరితదానుడ వారితశుభములు। దారంతస ఖునికిగోరితలంపగ॥ధరణీ॥

కేదారగౌళరాగం—అట. ౧౮

చంద్రకులసుధాజలరాసి చంద్రా। నరేంద్ర చంద్రవినవే॥ సాంద్రచింతనొంది। యింద్రారి వ్యాపలితేంద్రియుండై హృ దయమునదల। చెంద్రుడంబుగనచ్చెరుపడుచు॥చంద్ర॥

౧. ముంచితివారిధులా। గదలచేమొత్తించితిగిరితటులా ద్రో చ్చించితి। ఎంచకమీదని భేంద్రపంక్తులనురొ। ప్పించితిశస్త్రా స్త్రసంచయములచేగ్రు। మ్మించితినిదావాగ్నులను ద్రోయించు తిని పెక్కుబాధలనల। యించితినిసర్పములచేఁగరపించితిని శపి యించితిని గారించితికడు ధిక్కరించితినెన్నిజే। యించినను జావడిదిజూడగ। నెట్టిదొడ్డ విచిత్రమోయని॥చంద్ర॥

౨. ఎరుగడౌషధంబులా। లేరుభర్తలొంతుల వేవిధంబులాం। బో ధించినతరుగాడునిజకాంతి। తథ్యముజాడ్యము। బొరయదమి క్కిలీమెరయుచున్నవాడు।నెరయడొక్క నిమేషమయినను। నె

మ్మొగంబునదీనభావము। తరముగాదికనన్ని విధముల బొరః
చూచియువిసివివే। సరిలేవీని నెట్టి తెరగునద్యంతును పరమదివా
ద్భుతముపీనిప్ర। భావమెట్టిదికోయటంచును॥చంద్ర॥

3. ఆగ్రహంబుగాంచి। నేజేసిన నిగ్రహంబులెంచీ। పరుః
తోడవిగ్రహంబులుగాగ। వివరించిపలుకడ। నుగ్రహంబులం
చు నొవ్వకతలచును జాగ్రదతులతపఃప్రభావజ। నాగ్రగణ్యు
డుధీరుడనుసముదగ్ర కురుమద్దాలివెంకటా। చలాహ్వయదా
ససముదుమహొగ్ర తేజుడగుచు నొప్పెడుగాన। మృత్యుగ్ర
సనమగునితనిచేనవ్యగ్రగతిగా దనకటంచును॥చంద్రకుల॥

శుద్ధసావేరిరాగం—త్రిపుట ౧౫

దంతీశవరదాంఘ్రి।చింతనైకాంతవో। కౌంతేయాగ్రజవినవే॥
అంతటనయ్యేను। రాంతకుండునాదినీ చింతనొందుచుగడు
సంతసింపజూచి। మంతనంబునజేరిచండా। మార్కులీగతి
గారవించిరి॥దంతీశ॥

౧. శుభ్రవిఖ్యాతివయ్యా। నీప్రతాపము చోద్యముగదవయ్యాపొ
రులనురోషభ్రూవిజృంభమునసకలదిగీశులను। విభ్రాంతులుగజే
శి। విశ్వమేలితివి। దభ్రవచనములీ విధముననుదాహరింపగ ద
గునేనీకని॥దంతీ॥

౨. వక్రుడైనమానిసి। వృద్ధుగురునే। వలయందుగడునెనసీమే
ధానయో। పక్రాంతుడగువయః। పాకంబుతోబుద్ధి పక్రాం
తుజేయుము। విడవుమీరోషమును। శక్రవిద్వేషణా। శుక్రా

చార్యులును వచ్చునంతటకని॥దంతీ॥

3. దనుజేశుడామీదటా। ఆనీతివినితనమనమున గొనియావ టా। వినుశుకుర్మద్గాలి వెంకటాచలదాస। వినతుసలపకయుం డ। వేమారువీనికి ఘనగృహస్థాచారధర్మము దెలుపుడనియను మతిచ్చెను॥దంతీశ॥

మంగళహారతి.

ఝంఝూటిరాగం—ఆది. ౧౽

అంగజజనకవి। హంగతురంగాశృంగారచరితాంతర్వేదినార సింహా॥మంగళమేజయామంగళమే॥

౧. సరస శ్రీసాగరసంగదేశవాస। సురనుతప్రహ్లాదవరదనార సింహా॥మంగ॥

౨. వాసిష్ట గోదావరితీరమందిర। దాసారక్షణసువిలాసానార సింహా॥మంగ॥

. పంకహరణబిరు। దాంకాకురుమద్గాలి వెంకటాచలదాసా వినుతవారసింహా॥మంగళమేజయామంగళమే॥

---

4 వ ప్రకరణము.

హుశ్శేనీరాగం—జుల్వ ౧

ఓరాజతిలకా। చంద్రనిభాస్యఫలకా। వోరాజతిలకా॥ శౌరిగుణకథా సుధారసపానవి స్ఫారామహోల్లాస పూరిత పులకా॥

౧. యీాగతిబలికిన నాగురుతనయులు। వేగమెయతని౼ ౼౼ఘగ తీబాగుగాౖత్రివర్గ। భాగపాఠములెల్లాధీగతముగ నుపదేశమొ పంగిరి॥వో రాజ॥

౨. అనిశము రాగద్వే। షానుబంధమునే చే। కొనియున్న విష యాస। క్తుల కేకాకా మనవంటివారికి। పనికిరావివియిఖ౼న మునదల చెన। ద్దనుజకుమారకు॥వో రాజ॥

3. వ్యర్థముౖలైనప దార్థములెల్లయ। థార్థములనిసంసా। ౼ర్థ ముగాస్పర్థనొందచునుండు। పామరుల కేకాక। నర్థింపగాము నకవియేలనితలంచె॥వో రాజ॥

౪. గురుసుతులాహ్నిక। పరతబోనాటల మరిగితన్నసురబాలు రుబిల్వగా। పరగవారిజేరి। పరమార్థగతిమీర। స్థిరముగజ్ఞా నోపదేశముదొరకొ౼వో॥

౫. తాలిమికురుమద్దాల్ వెంకటాచల। దాసావరమపద్మ౼ళ లోచనూ। జాలభక్తిగొలిచి। మేలొందుదమనియా। బాలుర నందరవాలోకించిపల్కె॥వో రాజతిలకా॥

ఘంటారవం—అట ౨.

బాలులారారండూ మీకు। మెలుదెల్పెదా। మంచికీలుదెల్పి। ఆనందమూగీలుకొల్పెదా॥

తాలిమితోజూడుడీ లోనమనయాడు। బాలకులెందరు కూలి బోకొందరీ। నేలయెల్లనుతమ। పాలిదెయనినమ్మిచేలౖౖలైతుది

